## శ్రీ హయగ్రీవ జయంతి-పూర్ణిమ (అవతార విశేషము)వైభవము

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిమ్|
ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవ ముపాస్మహే||

సమస్త జగదాధారభూతుడగు శ్రీమన్నారాయణుడు దేవతిర్యఙ్మనుష్యస్థావరాదులనను గ్రహించుటకు అనేకావతారములనెత్తెను. అవి పూర్ణావతారములు. ఆవేశావతారములు. అంశావతారములుగా నున్నవి ప్రహ్లాదుని రక్షించుటకు శ్రీ మహావిష్ణువు నృసింహావతారమెత్తినట్లే రాక్షసులు అపహరించ బడిన చతుర్వేదములు రక్షించుటకు హయగ్రీవ అవతారమెత్తినట్లు ఇతిహాసములు చెప్పుచున్నవి.

శ్రీమదగస్త్య మహర్షిచే రచించబడిన పంచదశీ మహాభాష్యము హయగ్రీవ అనుగ్రహముచే రచించబడినట్లు చెప్పెను.

శ్లోకం|| హయగ్రీవాల్లబ్ధ్వా సకల మముమాద్యం మనువరం
కృతాటీకాతస్యానుమతవిధినాఽగస్త్యమునినా
కలాతత్త్వోద్భాసిన్య పరిమిత భాగ్యోదయకరీ
త్రయీసారాదుద్ధృత్యచ సదుపకారాయసుధియః||

మహాదేవీ అనుగ్రహమున విష్ణుమూర్తికి హయగ్రీవత్వము కలిగినదని చెప్పెను.

శ్లోకం|| హయానన! మహాబుద్ధే! సర్వశాస్త్ర విశారద|
కధితః లలితాదేవ్యాశ్చరితం పరమాద్భుతం||

శ్రీ హయగ్రీవ సహస్ర నామ స్తోత్రము నా శ్రీమన్నారాయణుడు హంస స్వరూపమగు ప్రణవమును మొదట ప్రజాపతికి ఇచ్చి తరువాత వేదముల నుపదేశించెనని చెప్పెను.

శ్లోకం|| పరమో హంస ఏవాదౌ ప్రణవం బ్రహ్మణేఽదిశత్ |
కధితః లలితాదేవ్యాశ్చరితం పరమాద్భుతమ్ ||

జగత్ కార్యమునకు వేదము లాధారమని వాటిని గాని బ్రహ్మ సృష్టి కార్యమును జగత్కార్యమునకు తన తండ్రియగు శ్రీ మన్నారాయణుని అనుగ్రహముచే చేయుచున్నాడని మనకు శాస్త్రములు తెలుపుచున్నవి. యో బ్రహ్మాణం..... తస్మై శ్రీమన్నారాయణుడు వేదములను చతుర్ముఖ బ్రహ్మ కుపదేశించెను. వారు దేవతాస్వరూపులై అధిష్ఠాతలుగా బాలకులవలె బ్రహ్మ సమీపమున యుండిరి చతుర్వేద స్వరూపులగు ఆ బాలకులవల్లనే సృష్టిని చేయుచున్నాడని రాక్షసులు తెలుసుకొనిరి.

వారును ఆవేదముల నపహరించి అట్టి సామర్థ్యమును పొందవలెనను కోరికతోనుండిరి. వాటిని అపహరించుటకు మధుకైటభులు సిద్దమయ్యారు. చతుర్వేదరూపులగు బాలురనపహరించిరి అప్పుడు సృష్టికార్యము నిలచిపోయెను. సరస్వతికి వాగ్బంధము జరిగెను. మహర్షులు యజ్ఞయాగాది క్రియలు నిత్య నైమిత్తిక కర్మకాండ లేనివారైతే అందుచే వారు అపవిత్రులయిరి. యజ్ఞయాగాది క్రియలు లేకపోవుటచే దేవతలు హవిర్భాగములేని వారయిరి.అప్పుడు ఇంద్రాది దేవతలు వేదవ్యాస పరశరాది మహర్షులు దేవదేవుడు పురుషోత్త ముడగు శ్రీమన్నారాయణుని ప్రార్థించారు. జగద్రక్షణ నిమిత్తము వేదరక్షణ నిమిత్తము శ్రీమన్నారాయణుడు హయగ్రీవ స్వరూపమును ధరించి మధుకైటభుల నెదిరించెను. వారిని వెంబడించెను. ఆ రాక్షసులు హయగ్రీవుని హేషారవములకు (సకిలింపు) ఎదురుపడలేక ఎందును దాటుటకు స్థానములేని వారయి ఆ బాలురతో సముద్రమును ప్రవేశించిరి. వారిని వెంబడించుచున్న హయగ్రీవుడు సముద్రమున ప్రవేశించి ఆ యసురులను సంహరించి వేదసంరక్షణగావించెను. వేదస్వరూప ములను ప్రజాపతికిచ్చెను. అప్పుడు ప్రజాపతి పరమానందముతో తన సత్యలోకమున తన స్థానమున కెదురుగా మణిమయ సింహాసనమున హయవదనుని ప్రతిష్ఠించెను. తరువాత మాటల కమ్మయగు సరస్వతితో సంతుష్టుడయి సృష్టిని ప్రారంభించెను. మధుకైటభులు అపహరించబడిన వేదరాశిని హయగ్రీవమూర్తి ఉద్ధరించు ఇంతవరకు మహర్షులకు యజన, యాజన, అధ్యయన, అధ్యాపనలు కేకుండుటచే అపవిత్రులయిరి. అందుకువారు ఆనాడు యజ్ఞోపవీతములను ధరించి తమ విధులను తాము జరిపిరి. అందుకే శ్రావణ పౌర్ణమి హయగ్రీవ జయంతి గాను, జంధ్యాల పూర్ణిమగాను ప్రసిద్ధి చెందినది. వేద విద్యార్థులకు ఉపాకర్మ అనుక్రియను జరిపెదరు. లోకమంతయు సృష్టి ఆగిపోవుటవలన ఏ వృత్తివారు ఆయాసాధనములకు ఆ రోజు విధిగా పూజాదులను చేసి పనులు ప్రారంభించవలయు నను సాంఘికాచారము కనిపించుచున్నది. తమతమ వృత్తులందు ప్రావీణ్యము సంపాదించుటకు లక్ష్మీ హయగ్రీవుని ఆరాధన ముఖ్యమయినది. కావున శ్రావణమాసము యొక్క వైభవములో లక్ష్మీ వ్రతం శ్రావణ పౌర్ణమి అనునవి తెలుసుకోదగినవి.

పురాణ ఇతిహాసములలో ప్రసిద్ధములైన భగవానుని | దశావతారములలో ఒకటిగా హయగ్రీవుని అవతారము | లెక్కింపకపోయిననూ వేదోద్ధరణకై సంభవించిన ఈ అవతారము చాలా ప్రధాన మైనది. వేదసముద్ధరణ కోసం | జ్ఞానము, వాక్కు, ఆచారము నాశనము కాకుండా సాగు నట్లు అనుగ్రహించుటకై ఈ అవతారము "శ్రావణ శుద్ధపూర్ణిమ"నాడు సంభవించినది.

శ్రీ మద్భాగవతమందలి సప్తమ స్కంధమున బ్రహ్మ నారద సంవాదములో భగవదవతారములను గూర్చియు అందు శ్రీ హయగ్రీవుడు బ్రహ్మ చేసిన యజ్ఞమందు ఆవిర్భవించినట్లు తెలియుచున్నది. స్కాంద వురాణమందు . బ్రహ్మాది దేవతలచే ప్రార్థింపబడి అశ్వముఖుడై భగవానుడు అవతరించాడని కలదు. ఇలా పురాణాలలోనే గాక పూర్వ గాధాలహరిలో కూడ హయగ్రీవ వృత్తాంతం ఈ ప్రకారముగా వ్రాయబడినది. ప్రళయకాలంలో శ్రీ మహావిష్ణువు కొంతకాలము జల రాశియందు శయనించి పిదప సృష్టిని చేయదలచి నాభి నుండి పద్మమును, పద్మము నుండి బ్రహ్మదేవుడిని సృజించాడు. సృష్టి కార్యార్థమై బ్రహ్మకు నాల్గు వేదాలు అప్పగించబడినవి. ఇట్లుండగా పరమాత్మచే సృష్టింపబడిన రజస్తమో గుణ పూర్ణులైన మధుకైటభులనే రాక్షసులిరువురు. బ్రహ్మనుండి చతుర్వేదాలను తస్కరించి పాతాళము చేరిరి. బ్రహ్మప్రార్థన ఆలకించినవాడై భగవానుడు పాతాళమునకు చేరి ప్రణవనాదం చేయగా ఆ నాదం వినబడు దిశగా దానవులిద్దరూ పరుగిడిరి. మధుకైటభులను సంహరించి స్వామి చతుర్వేదాలను చతుర్ముఖునికి అప్పగించాడు. ఈ వృత్తాంతం "దేవీ భాగవతం"లో కొద్ది మార్పులతో వర్ణింప బడినది.లక్ష్మియే విద్య (సరస్వతి) పేరున హయగ్రీవునికి ధర్మపత్నిగా నున్నదని ఈ వాగ్దేవి ఈ స్వామికి పత్నియని మల్లినాథసూరి నైషధ వ్యాఖ్యానమున పేర్కొన్నాడు. జగన్నాథమను దివ్య క్షేత్రమున లక్ష్మియు, సరస్వతియు అచటి స్వామికి ఇరువైపుల దేవేరులుగా వెలసియుండుట స్పష్టపడుచున్నది.

వాక్చనారీణామ్ అను గీతా వాక్యము ననుసరించి భగవానునికి వాగ్దేవియు ఒక పత్ని యని తెలియుచున్నది. ఆమె అనుగ్రహాన్ని పొందిన బ్రహ్మదేవుని పత్నికి సరస్వతి, భారతి, వాణి మొదలగు పేర్లు ప్రసిద్ధములైనవి.హయగ్రీవుడు జ్ఞానమును, వాక్కును అనుగ్రహించుటకై శంఖము, చక్రము, పుస్తకము, జ్ఞానముద్రను విష్ణు రూపుడని తెలుపుటకు చతుర్భుజుడైయున్నాడు. బ్రహ్మాదులకేగాక మన పూర్వాచార్యులు పరకాల స్వామికిని, వేదాంతదేశికుల కూడా తిరువహీంద్ర పురమందలి ఔషదాద్రి శిఖరమున నిష్టగా గరుడమంత్రం జపించగా గరుత్మంతుడు ప్రత్యక్షమై శ్రీ హయగ్రీవ

Ph: 9393569333 Email: sampathkumarastro@gmail.com

మంత్రమును ఉపదేశించెనట.ఆ మంత్రము జపించిన మాత్రమున స్వామి హయగ్రీవమూర్తిగా ప్రత్యక్షమై పరిపూర్ణముగా అనుగ్రహించెనట. ఈ విధంగా స్వామి సర్వ ఆరాధనా మూర్తిగా విరాజిల్లుతున్నాడు.నవీనకాలంలో పండిత జగన్నాథరాయలు వాగర్థ, సంపత్తిని హయగ్రీవుని అనుగ్రహం వల్లే పొందాడు. అందు లకే ఉత్తమ జ్ఞానమును, వాక్కును, ఉత్తీర్ణతను సకల శుభాలను పొందుటకై విద్యార్థులు, ఉపాధ్యాయులేగాక ప్రతి ఒక్కరూ జ్ఞానాభిలాషులై హయగ్రీవ అనుగ్రహం పొందు శ్రీ వేదాంత దేశికులచే రచింపబడిన "హయగ్రవస్తోత్రము" పఠించిన చాలును.

శ్లోకం|| హయగ్రీవ హయగ్రీవ హయగ్రీవేతి యోవదేత్|
తస్యసంగచ్ఛతే వాణీ జహ్నుకన్యా ప్రవాహవత్||

ప్రస్తుత కాలంలో వరలక్ష్మీ వ్రతము ప్రచారమున ఉన్నది. శ్రావణ పౌర్ణమి నాడు హయగ్రీవ జయంతి ఆనాడు విద్యాప్రదాతను ఆరాధించి "పాంచరాత్ర బ్రహ్మసంహితాతర్గత హయగ్రీవ వ్రతం" అను ఒక వ్రతం ఉన్నది దానిని సమస్త ప్రజలు ఆచరించి సమస్త సన్మంగళములు ప్రజలు పొందాలని కాంక్షించుచున్నాము. శ్రీలక్ష్మీ హయగ్రీవుని మంగళాశాసనము.

శ్లోకం|| వేదరాశి సముద్ధర్త్రే లోకశాస్త్రి ప్రదాయినే |
మధుకైటభ హర్త్రాచ హయగ్రీవాయ మంగళమ్ ||